# సత్యాద్రౌపదిసంవాదము.




(గ్రంథకర్త్రి)

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే

రచియింపబడినది





మొదటికూర్పు 1000 ప్రతులు.

చింతామణిముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె

రాజమహేంద్రవరము.

1926




[వెల అ. 0-2-0.

# విజ్ఞప్తి.

ఆంధ్రవాఙ్మయమున గేయకవిత యతిప్రాచీనము. విద్యాగంధములేని స్త్రీలలో నీతిప్రబోధమైన గలిగియున్నచో నది పూర్వకవులు వ్రాసిన గేయముల వలననే యని చెప్పవచ్చును. ధర్మములు, నీతులు పురాణేతిహాసములు, వ్రతకథలు, భక్తచరిత్రములు భగవల్లీలలు మున్నగునవి పెక్కులు మన తెలుగులో పాటలరూపముననే యున్నవి. పూర్వకవి విరచితములగు పాటలకెల్ల జనని ద్విపద. వ్యాకరణ బద్ధత లేక యతిప్రాసనియమము లేక, పాడుటకు సులభముగా గణనియతినిమాత్రము పాటించి వ్యావహారికపు తెలుగులో పూర్వపుపాటలు వ్రాయబడినట్లు సీతలేఖ, లక్ష్మణునినవ్వు సంక్షేపరామాయణము, కుశలవయుద్ధము నానుపాట మున్నగునవి చూచినవారికి తెలియుచున్నది. నేనుగూడ నదే పద్ధతి ననుసరించి యీపాటను వ్రాసితిని. పండితులిందలి దోషముల క్షమియింప ప్రార్థన. ఆంధ్రసోదరీమణులు లల్లరీ పాటను నాదరించెదరుగాక.

ఇట్లు

రచయిత

# సత్యాద్రౌపదీసంవాదము.

(సంక్షేప రామాయణము వలెఁగాని
చాపు తాళంగాని పాడవలెను.)

శ్రీ వనకీర్తులు । పాండునందనులు
సిరిమీఱ రాజ్యంబు । సేయుచునుండ ౧
కడుకుత్సితుండైన । గాంధారిసుతుడు
కనలేక యీసున । గడునీచబుద్ధి ౨
తనమిత్రులును దాను । తంత్రంబు చేసి
జూదాన వంచించి । చూఱగొన్నట్టి ౩
ధరణిరాజ్యంబెల్ల । తనతండ్రి మరల
పాండవేయులకిచ్చి । పంపినవిధము ౪
దుర్యోధనుఁడు విని । దుఃఖంబుఁ జెంది
తనతండ్రి కడ కేగి । తగనిట్టు పలికె ౫
అహితులౌ వారిని । విహితుల జేయ
ఘనరాచవారికి । ధర్మమై యొప్పు ౬
పాండవేయుల కెగ్గు । పలుమాఱు చేసి
ఇపుడు మేల్సేయంగ । హితులమవుదుమె ౭

తండ్రినీవెఱుగవు । తగవారితలపు
నాపుత్రులేయంచు । నమ్మెదుమదిని ౧౯
నమ్మ తమ్ముడనిజంబ । ననిలపుత్రుండు
సతిభంగ సమయాన । సమయంబుసేసె ౨౦
యుద్ధంబువారికి । నొప్పమియౌని
తిమపంతములువారిక్క । తగనెట్లుచెల్లు ౨౧
ధర్మజుడొకవేళ । తగనోర్చియున్న
అనుజులేలాయుందు । గనిసేయకుండ ౨౨
గదగొనిభీముండు । కదనాననిలువ
పార్థుండు విలుగొని । బవరంబుజొరగ ౨౩
ఖడ్గాలుచేబూని । కవలలురాగ
ననినోర్వశక్యంబె । యవ్వీరవరుల ౨౪
బగిజూదమునగాక । యుద్ధరంగమున
వారినోడించుట । వట్టిదితండ్రి ౨౫
ధర్మజుడెంతటి । ధర్మాత్ముడైన
దాయయైనప్పుడు । దాయయేకాక ౨౬
దాయలపెంపును । తగవంచకున్న
చవారికిసిరి । రాజిల్లునెట్లు ౨౭
కావున నాతండ్రి । కోదన్క్కనీవు
అంగీకరింపుమీ । యూదజూదంబు ౨౮
అటుసేయమానిన । నయ్యారోనేను
అసువులబాయుదు । నశసంబుమాని ౨౯

కోమరుండు యీరీతి । కోపించిపలుక
కడుభీతిజెందియూ । కౌరవప్రభుడు ౩౦
ధర్మజుగొనిరాగ । తగసూతసుతుని
యంపెవారి పురికి । సతిశీఘ్రమునను ౩౧
ప్రాతికామీగియూ । పాండుపుత్రులను
తావచ్చినాపని । తగవిన్నవించె ౩౨
తండ్రిపనుపుమతి । దైవంబుపనుపు
దాటశక్యమెయుంచు । ధర్మాత్మజుండు ౩౩
అనుజులతోగూడ । యతిపతోగూడ
నరుదెంచవేగమే । హస్తినాపురిక ౩౪
మరలజూదంబాడ । మణిమంటపమున
ధర్మజశకునులు । తగజేరిరంత ౩౫
అభిమతార్థుండైన । యాశౌబలుండు
ధర్మజుగాంచియూ । తాబల్కెనిట్లు ౩౬
ధనరాజ్యసంపద । తండ్రిమీకిచ్చె
వానిపందెముపెట్ట । పాడిగాదంక ౩౭
క్రొత్తపందెంబొండు । కోరిచెప్పెను
అపురూపపణమిది । యాలించుమిట్లు ౩౮
ఓడిబడియూపాండ । మోసినవారు
పల్కలంబులుగట్టి । వనములందుండు ౩౯
కాయలు ఫలములు । కందమూలములు
ఆతిరేకుగుడిచియూ । యశసంబునూని ౪౦

శౌమ్యసహాయులై । ధైర్యంబుతోడ
కాననభాగ్యల । గడపుకరండు ౫౨
వ్యాసాదిమునులచే । వరశిక్షనొంది
దైవమానుషశక్తి । దనరారుమీకు ౫౩
చండప్రసూర్యాలుగాంచి । చాలగాపృథివి
రక్షింపుచుండెను । రక్తితోనపుడు ౫౪
అనివిదురుండు చెప్ప । సతిభక్తిమొక్కె
తానేగెగంతట । తల్లిసన్నిధికి ౫౫
తనయులు లేవచ్చి తనకాళ్ళకెరగ
కడుదుఃఖమునకుంతి । కళవళబడుచు ౫౬
నాచిన్నసుతులార । నాయన్నలార
జూదానమీకెట్టి । చుమ్మర్లువచ్చె ౫౭
రాజభోగమువీడి । రాజ్యంబువీడి
కానలనుండుకై । కడుదీనవృత్తి ౫౮
నారచీరలగట్టి । నగలను యొలిచి
కాయగసురతో । కడుపులునింపి ౫౯
బ్రహ్మచర్యముగాని । వనములదిరుగ
సుతులారమిమ్మెట్లు । చూచిసైరింతు ౬౦
వేవేలవిధముల । వేల్పులగొలిచి
మిగులసంతోషాన । మిముగన్ననాడు ౬౧
పుణ్యభాగ్యాలంచు । పొంగితికాని
యెరయులేనైతిమీ । యడవికష్టాలు ౬౨

ఎంతటిపుణ్యవో । తొలఁగిమీ[illegible]యయ్యె
మీబాధలరయక । మృతి[illegible]దేముందె ౬౩
పతితోడదివికేఁగి । పడఁతియాంధ్రాద్రి
సుతులబాధలగన్క । సుభగురాలయ్యె ౬౪
కన్నసుతులపాట్లు । గాంచగనేమొ
దీర్ఘాయువిడెనాకు । దిట్టరిబ్రహ్మ ౬౫
ధార్తరాష్ట్రులుకడు । దౌష్ట్యంపుబుద్ధి
ధర్మమార్గముదప్పి । దయలేకనిట్లు ౬౬
వంచనచేసిరో । వనములకంప
బాహుబలాఢ్యులు । బహుధర్మవిధులు ౬౭
విదురగురుకృపయు । భీష్మాదిమునులు
పాడియొహర్షింప । వారింపకుండ ౬౮
ద్వారకాపురినాథ । దైత్యసంహార
నీపాదభక్తుల । నిర్మలమతుల ౬౯
నీముద్దుమఱదుల । నిప్పాండుసుతుల
కరుణాకరాతగవె ॥ కావకయుంట ౭౦
నాచిన్నిసహదేవ । నాకన్నతండ్రి
అరుగుదేనీవును । నడవులదిరుగ ౭౦
నీవెక్కడున్నను । నిజమునీయున్న
లందఱున్నట్టులే । హర్షింతుమదిని ౭౧
అనియిట్లుపొక్కుచు । నతివయాకుంతి
పాంచాలిగాంచియో । బాష్పంబులురల ౭౨

పుట్టినయిల్లును । మెట్టినాయిల్లు
పావనంబాయెను । పడతినీవల్ల ౨౩
పతులనుగూడియో । వనములకేగు
భాగ్యంబుగంటివి । భామరోనీవు ౨౪
యుపచారములువారి । కొప్పుతో జేసి
ఆకలిదప్పుల । సరసిసేవించి ౨౫
కడుఘోరమృగములు । కలయువ్వనాల
కడుసాహసికురాలైన । కాంతులేవ్వరను ౨౬
నాకుమాటలుగజూచి । నాతిరోనీవు
కంటికిరెప్పవై । కాచుకగమ్మ ౨౭
కానసబాధల । కడుస్సైపలేక
భీమువిజయులేమి । పలికినదుదురో ౨౮
కవలలుయెంతటి । ఘూతజేతురో
ధర్మజుడేమని । తలచునోమదిని ౨౯
మదిగమనించుచు । మానినినీవు
ధైర్యంబువారికి । తగజెప్పుచుండు ౩౦
కాననకష్టాలు । గడచినవెనుక
కాంతనాకోమరుల । కంఠారజూపి ౩౧
నాదీవనలబొంది । నాతిరోపిదప
నిండారుసిరులను । నీవొందుదమ్మ ౩౨
అనికౌగలించెను । నతివయాకుంతి
కోడల్నియెంతయు । కూర్మిమీరంగ ౩౩

అత్తయాంకోడలి । నటుకౌగిలింప
ఇద్దరికన్నీళ్లు । యేకమై పారె ౧౪
ఆతీరుజూచియో । అటనున్నవారు
కన్నీరునించిరి । కడుదుఃఖమునను ౧౫
దుఃఖమున్నయొకకొంత । తొలగిన వెనుక
కన్నీరుతుడుచుక । కాంతయాకుంతి ౧౬
కోడలికొడుకుల । కోరికీవించి
వీడ్కొల్పి తానిల్చె । విదురునియింట ౧౭
ధర్మజుని వెను వెంట । తమ్ములు యేగ
వారికి వెను వెంట । వనితపాంచాలి ౧౮
తలవిరబోసుక । తలవంచియేగ
తగవారి వెనుకనే । ధౌమ్యుండు యేగ ౧౯
అశుభంబు తమకని । యాత్మలోదలంచి
కడుదుఃఖమందిరి । కౌరవాంగనలు ౨౦
అన్న వెనుక నేగం । మనుజులందారు
పంతాలుఘనముగ పల్కిరియిట్లు ౨౧
దుర్యోధనాదుల । ద్రుంతుయుద్ధాన
అనుచుభీముడుపల్కె । పతిభీకరముగ ౨౨
కర్ణుజంపుదునంచు । గాండీవిపల్కె
శకునిజంపకవలం । శపథంబులనిరి ౨౩
పాండుతనయులిట్లు । పంతినలబట్టి
వేవేలవిప్రులు । వెను వెంటనడువ ౨౪

పురజను లెల్లను । పొక్కుచునుండ
తమయాయుధములతో । తరలిరివనికి ౯౫
పాండవులీరీతి । వనములకరుగ
దుర్నిమిత్తంబులు । తోచెనీరీతి ౯౬
నక్కలుకూసెను । నగరియంతటను
పసుగులు రాలెను । భీకర మొప్ప ౯౭
భూరిభయము నొసగ । భూమికంపము చె
కాకఘూకంబులు । కడు ఘోషబెట్టె ౯౮
పడునాగ్నయోట । జనగా ఘోరమైన
కౌరవకౌంతేయు । కదనంబుజరుగు ౯౯
అందుపాండుసుతుల । కబ్బునుజయము
కదనాన జచ్చుగు । కౌరవులెల్ల ౧౦౦
అనుచు నాగురుడాడె । నందఱువినగ
ధృతరాష్ట్రుడదివిని । ధృతిసెడి మదిని ౧౦౧
కడుభీతినడలుచు । కలవరపడుచు
కౌంతేయులడవుల । కరిగిన విధము ౧౦౨
కనుగొనమనసున । కడువేడ్క కలుగ
విదురునిరావించి । వివరింపుమనెను ౧౦౩
విజ్ఞానవిదుడైన । విదురుండునంత
వివరించెనన్నిట । విధమెల్లనిట్లు ౧౦౪
తనమోమువస్త్రాన । తగగప్పుకొనియు
ధర్మజుడేగెను । తెలుప చివరికి ౧౦౫

బాహువులరెండింటి । బహువిస్తరించి
భీతావహంబుగా । భీముండుయేగె ౧౦౬
ఇసుకనుపిడికిళ్ళ । విసరుచువేగ
అర్జునుడేగెను । నడవికివినుము ౧౦౭
మిగులపెంధూళిని । మేనునబూసి
సుకుమారతనుడైన । నకులుండుచనియె ౧౦౮
సహదేవుడడవికి । చనెతలవంచి
పీడినకొప్పుతో । వెడలెపాంచాలి ౧౦౯
సామవేదంబును । జదువుచువెనుక
ధౌమ్యుండుయేగెను । తగవారితోడ ౧౧౦
కౌంతేయులట్లేగ । కారణంబేమి?
అనియడ్గెధృతరాష్ట్రు । డప్పుడావిదురు ౧౧౧
తనచూపులోకంబు । దహియించుననుచు
తలవంచియట్లేగె । ధర్మాత్మజుండు ౧౧౨
బాహుబలంబనిక । బ్రకటింతునంచు
భీముండుబాహుల । విస్తరించేగె ౧౧౩
ఇసుముచల్లినట్లు । యేతుబాణాల
నని దెల్పనట్లేగె । నర్జునుండరయ ౧౧౪
అందమౌతనమేను । నగుపడకుండ
నకులుడారీతిని । నరిగెనువనికి ౧౧౫
తనదుఃఖవదనంబు । తగగాంచుజనుల
కెగ్గనిసహదేవు । డేగనారీతి ౧౧౬

కౌరవులనిలోన । కాలంబు సేయ
వారిపుత్రులెల్ల । వగచెదరనగ ౧౧౭
తెలిసినవలువతో । తలవిరబోసి
ద్రౌపదియారీతి । తగనేగియుండె ౧౧౮
భారతయుద్ధాన । పరమపదించు
వీరులపరలోక । విధులను దెల్ప ౧౧౯
సామవేదంబును । చదువుచునెల్ల
ధౌమ్యుఁడారీతిని । తావెళ్ళియుండె ౧౨౦
ఇప్పటికైనను । నిభపురనాథ
వారినిరప్పించి । వసుధరింజెల్ల ౧౨౧
వారిరాజ్యంబును । వారికేయంగ
యెగ్గాను లేకున్న । లగ్గుతెప్పదు ౧౨౨
విదురుడీరీతిని । వివరింపమదని
ధృతరాష్ట్రుడంతయు । తెలుపవిని ౧౨౩
యతిదుఃఖమునమద । పడలుచుండియును
పుత్రమోహముచేత । పాలివ్రావబుద్ధి ౧౨౪
పాండవేయులవాని । వాసంబునుండె
క్రమ్మరింపకమాని । కల్మషుండగుచు ౧౨౫
యెట్టివారికైన । నీపృథ్వియుండదు
కాలకర్మవశమ । కాదనతరమె ౧౨౬
పాపదుర్మతంబున । పగతురచేత
యటుభంగమందిన । యాపాండుసుతులు ౧౨౭

వైభవచ్యుతులరై | వనములనుండ
వారినిగనవచ్చె | వాసుదేవుండు ౧౨౮
రమణిసత్యనుగూడి | రథముపై నెక్కి
తముగానవచ్చిన | దైత్యారిగాంచి ౧౨౯
కడునెయ్యమడరగా | కౌంతేయులంత
అర్ఘ్యపాద్యాంబుల | నతనిపూజించి ౧౩౦
యుచితాసనంబున | నొప్పంగనునిచి
విప్రోత్తములతోడ | వినయమొప్పార ౧౩౧
అతనిబరీక్షించి | యతిభక్తినుండె
వనవాసబాధల | వసివాడియున్న ౧౩౨
మఱదులక్షేమంబు | మాధవుండడిగి
పాంచాలిగాంచియో | పల్కెసిరిపతి ౧౩౩
ధార్తరాష్ట్రులవైన | దౌష్ట్యంబువల్ల
చెల్లెలానీకట్టి | చిక్కులువచ్చె ౧౩౪
కడుసుకుమారివై | గ్రాలెడునీకు
కాననవాసంబు | కల్గెగానకట ౧౩౫
మిముమానవపట్టియో | మీరలక్ష్మినవ్విచ్చి
నీకిట్టికష్టాలు | నెఱిగూర్చినట్టి ౧౩౬
ధార్తరాష్ట్రులుతమ | దౌష్ట్యంపుఫలము
అనుభవించెదరమ్మ | యతిశీఘ్రముగను ౧౩౭
అనిమాధవుండంత | స్నుషగపాంచాలి
గతభంగపాటులు | మఱియెదురాడ ౧౩౮

పటుదుఃఖమొందుచు । సద్భక్తుగాంచి
కరములుజోడించి । కడుభక్తి మెఱయ ౧౩౯
ద్వారకాపురినాథ । దైత్యసంహార
ఖలబాధభవిభాస । కలిగినస్వామి ౧౪౦
సర్వవ్యాపివినీవు । సర్వమయుడవు
సర్వదర్శనుడవు । సర్వనియతవు ౧౪౧
నీవెఱుగనిదద్ది । నిఖిలలోకముల
అయినను తెలిపేను । అన్నరో వినుమి ౧౪౨
స్వపదమ్ముహీంపతి । సుహితనై బుట్టి
కుంతీమహాదేవి । కోడలనబడి ౧౪౩
నిరుపమవిక్రమా । న్వితులయి వెలయు
పాండుతనూజుల । పత్నినాంబరంగి ౧౪౪
విక్రమశాలినా । విఖ్యాతిగన్న
అన్నదృష్టద్యుమ్ను । సనుజాతనయ్యు ౧౪౫
నిఖిలలోకంబుల । నిండారుభక్తి
పూజసేయుండవై । పోలుపొందునీకు ౧౪౬
కడుగూర్చుచెల్లినా । ఘనతనుబొంది
పాపకర్ములచేత । భంగంబునడితి ౧౪౭
నిజసతికొప్పును । నిండుకొలువున
పాపాత్ముడారీతి । పట్టీడ్చుచుండ ౧౪౮
అసహాయశూరులు । నభిమానధనులు
శరణన్నవారిని । కరుణరక్షించు ౧౪౯

క్షత్రియపుత్రులు । శౌర్యకలితులు
పల్లెత్తరైరిగా । పాండునందనులు ౧౫౦
భీముబాహుబలము । విజయువిల్విద్య
కొఱగాకపోయెను । కోమలింగాన ౧౫౧
విదురగురుకృపయా । భీష్మాదిఘనులు
కండ్లారజూచుచు । కాదనరైరి ౧౫౨
అన్నలుదమ్ములు । సఖలబంధువులు
పతులునుపుత్రులు । పరివారజనము ౧౫౩
అందఱుండియుకృష్ణ । యాకష్టవేళ
నాకుతోడైరిగా । నాడునెవ్వారు ౧౫౪
అవమానదుఃఖాన । నల్లోడ్చునన్ను
కనుగొనికడునవ్వె । కర్ణుండుసభను ౧౫౫
దుశ్శాసనునిదైన । దుశ్చేష్టకన్న
కర్ణునినవ్వుమది । కాల్చుచుండూను ౧౫౬
ఒకనాటిబాధలా । యొకనాటిసొదల
కౌరవబాధలు । కలకాలమాయె ౧౫౭
పాములుగఱిపించి । పవనాత్మజునకు
విషమును బెట్టిరి । విసిచిరిగంగ ౧౫౮
కాశికిబంపియు । కాల్చదలచిరి
మాయజూదంబున । మానినిబట్టి ౧౫౯
అవమానమొనరించు । టదిచాలకిపుడు
అపహరించిరిపుడు । సకలరాజ్యంబు ౧౬౦

తనుకీళ్లుయెగ్గులు । తగవారుసేయు
అన్నిటికోర్చుచు । ననకలభంగి ౧౬౧
యున్నట్టిభర్తలు । యువిదబన్నంబు
బాపంగగలరెల్లు । పరమాత్మచెపుమా ౧౬౨
అనియిట్లుపాంచాలి । యతిదుఃఖపడుచు
శ్రీకృష్ణమూర్తికి । చెప్పభంగంబు ౧౬౩
బాష్పాంబుధారల । పైపెల్లదడియ
కన్నులచేతుల । కడనొత్తుకొనుచు ౧౬౪
వాపోవుచున్నట్టి । వనితనుగాంచి
కంసమర్దనుడుతా । కడుజాలిబొంది ౧౬౫
శోకంబునుడుగుమా । సోదరీనీవు
నిరుపమవిక్రమా । న్వితులునీపతులు ౧౬౬
ధర్మబద్ధతనప్పు । తలఁగిరికాని
నినుభంగపఱచిన । నిర్దయాత్ములను ౧౬౭
నాసహాయంబున । నవలీలగొట్టి
నీకుసేయకపోరు । నిజమాజిలోన ౧౬౮
యువిదనిట్లాకృష్ణు । డోదార్చుచుండ
మహితమార్కండేయ । మౌనీంద్రుడటకు ౧౬౯
వాసుదేవునిమఱి । పాండవేయులను
కరమాదరంబున । గాంచంగవచ్చె ౧౭౦
అమ్మౌనిచంద్రున । కర్ఘ్యపాద్యములు
భక్తినిపాండవు । లుపచరించుచుండ ౧౭౧

సత్యనుద్రౌపదిని । సకియపాంచాలి
పర్ణశాలాంజేరి । పరమాదరమున ౧౭౨
వివిధసల్లాపాల । వెలయుచునుండ
పాంచాలితోసత్య । పల్కెనీరీతి ౧౭౩
పదినేనాఁకశంక । మదియందుగలిగె
అదియేమియంటేని । యతివరోవినుము ౧౭౪
నీప్రియభర్తల । నిప్పాండుసుతుల
వదలకఁగొల్తువు । వదినెనీవెట్లు ౧౭౫
ఒకరికంటెనొకరు । యువిదనీయందు
అనురక్తులైయుంట । యక్కజంబయ్యె ౧౭౬
మంత్రాలవల్లనా । మందులవలన
వ్రతములవల్లనా । నరవిలాసమున ౧౭౭
పల్కులువల్లనా । పాండిత్యమునను
ఏవిధినీకబ్బె । యింతభాగ్యంబు ౧౭౮
నేనునీవల్లను । నిదియెల్లయెఱిగి
శ్రీకృష్ణువశగతు । జేసికొనెదను ౧౭౯
సత్యతానిట్లన । సఖియపాంచాలి
కించుకకోపంబు । యెదయందుఁగల్గ ౧౮౦
మందహాసంబున । మదికోపమడచి
మాధవుసతితోడ । మఱియిట్లుబల్కె ౧౮౧
ననుచెడుస్త్రీవలె । నాతిగోదలచి
యిట్లాడదగునమ్మ । యింతిరోనీకు ౧౮౨

కావున నెపుడిట్టి । కైవసక్రియలు
కావింపరాదమ్మ । కాంత తాపతికి ౧౯౪
పతిచిత్త మెఱిగియో । పడతివర్తింప
సతికిలసంతసి । సమకూరుశుభము ౧౯౫
పతులేవురనురాగ । భరితులై యుండు
కారణంబెఱిగింతు । కాంతరో వినుము ౧౯౬
పతులాత్మ వేరొక్క । సతిగూడకోర
కోపంబుజెందను । కోమలీనేను ౧౯౭
భక్తితో వారికి । బరిచర్య జేతు
నప్రమత్తనగుచు । నన్ని వేళలను ౧౯౮
మనసుననోరీతి । మాటలోరీతి
చేతలోరీతిగా । చేయు నేనెపుడు ౧౯౯
అకలంకచిత్తనై । యన్నిపనులను
నియమిత వేళల । నేదీర్చుచుండు ౨౦౦
దేవప్రాత్తముడయిన । దివ్యరూపైన
పరపురుషునిగడ్డి । పలుకే గాజూతు ౨౦౧
స్నానభోజనసమితి । శయనాదివిధుల
పతులకుముందెప్డు । వదిననే జేయు ౨౦౨
పతులు రాగనె వారిక్కి । పలసిన పనుల
నితరులబంపక । నేనెగావింతు ౨౦౩
మజ్జనభోజన । మర్యాదలెల్ల
నియమితంబుగనేన । నేర్పుతో జేతు ౨౦౪

భర్తలధనధాన్య । భాగ్యంబులెల్ల
వ్యర్థవ్యయముసేయ । వదినె నేనోర్వ ౨౦౫
గృహమైన పెరడైన । గృహపాత్రలైన
యశుచిమైయుండుట । కంగీకరింప ౨౦౬
చెడుయువిదలతోడ । చెలిమితోనుంట
కయ్యంబులాడుట । కడుకోపబడుట ౨౦౭
వాకిట మెలగుట । పకపకానగుట
నాకుగానిదిసుమ్మ । నాతిరోవినుము ౨౦౮
పరదేశవాసులై । పతులుండిరేని
సౌగంధవస్తుల । చక్కనిపువ్వుల ౨౦౯
దివ్యంపువలువల । భవ్యంపునగల
నేదాల్చకుందును । నెలతరోయపుడు ౨౧౦
మామయత్తకుంతికి । మదిహర్షమొదవ
మజ్జనభోజన । మర్యాదలెల్ల ౨౧౧
నేనెయామెకు జేతు । నేర్పునమతియు
ఆమెయాజ్ఞకుసదా । యతిగడ్వకుందు ౨౧౨
పాండవాగ్రజుభక్తి । పసిడికంచాల
పదివేలయతులనె । న్మిదివేలవిప్రు ౨౧౩
లనుదినంబును వేడ్క । నారగించేరు
వారికివలసిన । వసతులనెల్ల ౨౧౪
నేనెగావింతును । నిండారుభక్తి
తరుణులునూర్వేలు ధర్మజునగరి
పాత్రహస్తలగుచు । బవలును రేయి ౨౧౫

కుపితాత్ములై కేని । కుంతీతనయులు
అహింసమానులటంచు । సడలుచునుందు ౨౨౭
మృదులంబుగానిట్లు । మెలగుచునుంట
పావనకీర్తులౌ । పాండునందనులు ౨౨౮
నిజకుటుంబభరము । నిట్లునాకొసగి
తాము నిశ్చింతులై । తగువేడ్కనుంద్రు ౨౨౯
ఇమ్మహాభారంబు । నిట్లుదాల్చుటను
వేగుబోకనె లేచి । వెలది నేనున్న ౨౩౦
రవ్వంతసేపైన । రమణిరో నాకు
తీరికగల్గదు । తిండినిద్రలకు ౨౩౧
ఇటు సేయుటను జేసి । యింతిరో వినుము
పతులునాపై ప్రేమ । పాటింత్రుగాని ౨౩౨
వదినె నీవడిగిన । వశ్యౌషధములు
మంత్రతంత్రాదులు । మఱి నేనెఱుంగ ౨౩౩
పాండవసతియిట్లు । పల్కగా సత్య
సిగ్గును తాజెంది । శిరమునువంచి ౨౩౪
తనతప్పునెఱుగుట । తడఁబడమాట
పాంచాలితోడను । పల్కెనీరీతి ౨౩౫
నీమహామహిమంబు । నెఱుగకవదినె
పలికితి నేనిట్లు । పాపంపునుడులు ౨౩౬
నవ్వులమాటగా । నాతినీవెంచి
సైరింపునాతప్పు । సన్మహాబుద్ధి ౨౩౭

ఆపల్కులాలించి । యతివపాంచాలి
చిఱునవ్వుతోడను । శ్రీకృష్ణుసతికి ౨౩౮
పతిమదివశముగు । భవ్యమార్గాలు
నాలుగుగలవవి । నాతిరోవినుము ౨౩౯
పతికంటెదైవంబు । సతికెందులేదు
పతికరుణించుటే । సతికిభాగ్యంబు ౨౪౦
ధనధాన్యసంపత్తి । తగుగౌరవంబు
అంబరాభరణాది । యాఢ్యవస్తువులు ౨౪౧
సంతానలాభంబు । సద్గతియశము
భర్తయిష్టుండైన । భామకుగల్గు ౨౪౨
యెంతవారికినైన । నీపృథ్వియందు
కష్టపడకనెప్డు । కలుగదుసుఖము ౨౪౩
కాన కాంతునిగొల్చి । కాంతలుభక్తి
ధర్మసుఖాదులు । తగపొందలెన్న ౨౪౪
నిర్మలమతితోడ । నిత్యంబునీవు
భయమును ప్రేమంబు । బహుభక్తిగల్గి ౨౪౫
ప్రీతిజూపితి మేని । విభుడేతసంత
నిండారుమక్కువ । నీవెంటదగులు ౨౪౬
మాయన్నకృష్ణుండు । మగువరోసీదు
మందిరంబేతేర । మన్ననతోడ ౨౪౭
సంభ్రమమునలేచి । సంప్రీతినెఱపు
సంపకునోరులను । బతిసేవసేయు ౨౪౮

మక్కువనీతోడ । మాధవుంతన్న
రాహస్యమేరితో । గమునే తెలుపకు ౨౪౯
నీపతికెవ్వారు । నతిగూర్చువారో
వారినిసేవ్రను । వనితమన్నించు ౨౫౦
నీకంతెహంతుల్లైన । నెలతసోదరులను
నీభర్తయగువారు । నీకిష్టయుంచు ౨౫౧
ఆలుమగలపొత్తు । యతివసోవినుము
సౌఖ్యంబుచేకూర్చు । సంసారమునందు ౨౫౨
ప్రద్యుమ్నసాంబులం । భగినీయసుతుల
పొత్తునకైనను । పోలదోసీవు ౨౫౩
యేకాసనంబున । యేకాంతమునను
కూర్చుండియుండుట । కూడదుసుమ్మి ౨౫౪
అకలంకచిత్రలు । యాతిగుణవతులు
కులసతులైనట్టి । కొమ్మలతోడ ౨౫౫
స్నేహంబుసేయుము । చేతనోమఱియు
గడుసతులాపొందు । సేయకుమెప్పుడు ౨౫౬
ఇదిసౌఖ్యమూలము । యిదిపుణ్యహేతు
విదికీర్తిదాయకం । బింతికివినుము ౨౫౭
యీరీతివర్తించు । నింతులకెల్ల
సకలశుభంబులు । సమకూరుసుమ్మి ౨౫౮
అనికృష్ణపల్కగా । నానందమంది
సత్యతాపాంచాలి । సంప్రీతిజూచి ౨౫౯

నదినెనీసద్ధర్మ । వాక్యములవినగ
చెప్పలేంతపుణ్యంబు । చేసెనో నేను ౧౬౦
నీధర్మబుద్ధికి । నెలతరో మెచ్చి
నిరంతరసుఖములు । నీకుండఁగూర్చి ౧౬౧
నిను భంగపుచ్చిన । నిర్దయాత్మక
తప్పక పొందెరు । తమచేతిఫలము ౧౬౨
అవిచారచిత్తనై యుంటినయ్యోయంచు
అనియిట్లుసత్యతా । నను చూచునంత ౧౬౩
ద్వారకాపురికిని । తరలిపోవంగ
మనసుననూహించి । మధుసూదనుండు ౧౬౪
రథమునురావించి । రమణిఁగొంపోవ
ఆయత్తుఁడై వేగ । యరుదెంచెనంతకు ౧౬౫
నిజసతిగర్వంబు । నెఱిదూలునట్లు
పాంచాలియానతి । పల్కులవిధము ౧౬౬
సర్వజ్ఞుఁడగుటను । స్వాంతాననెఱిఁగి
మొగమున నవ్వెను । మాధవుండప్పుడు ౧౬౭
తనపతినవ్వను । తా నెఱ్ఱఁగిసత్య
సిగ్గునతలవంచి । చిఱునవ్వునవ్వె ౧౬౮
పాండవదేవిని । వైకుంఠుదేవి
కౌగిటఁజేర్చియు । కరమాదరమున ౧౬౯
ఆమెపుత్త్రులక్షేమ । మారసిచెప్పి
వీడ్కొని తేరెక్కి । విభునితోనంత ౧౭౦

భవ్యకీర్తిమద్దైన । భానదేవుండు
భక్తసేవితుఁడౌచు । పరగఁజెలొ్వందు ౨౭౧
భవ్యశోభితమైన । కాట్లపురిని
నిరుపమంబైపొల్చు । నియ్యోగశాఖ ౨౭౨
నగపాలపర్తిని । స్వగోత్రాంబుట్టి
ననుపర్తివంశంబు । ఘనముగాకొచ్చి ౨౭౩
ఇరుదెసబంధులు । నెలమినిఁజూడ
వరలక్ష్మియనపేర । వరిచెనుసాక్షి ౨౭౪
అక్షయసంవత్సర । మాషాఢమునను
ఆదిపక్షంబున । కలచతుర్దశిని ౨౭౫
స్థిరవారమునభువి । స్థిరముగావెలయు
న్నాసెదానిపాట । వనితలర్పొంగ ౨౭౬
కూపాటభక్తితో । గాంచుతెన్నాగ
పాడినవిన్నాను । పరమాదరముగ ౨౭౭
శిష్టరక్షణుఁడైన । చిన్నికృష్ణుండు
ఆపదవేళల । సంప్రీతుడైప్రోచి ౨౭౮
సకలసంపదలిచ్చి । సౌభాగ్యమిచ్చి
సద్గుణంబులనిచ్చి । సౌఖ్యంబుగూర్చు ౨౭౯
మాతల్లితోఁబాటు । మమ్ముబెంచినట్టి
మానవతివివేక । మాపెద్దతల్లి ౨౮౦
ఘనతుర్లపాటివేం । కటసుబ్బమాంబ
కర్పించెనుసీపాట । నతిభక్తితోడ ౨౮౧

సంపూర్ణము.

# వసుమతి.

గ్రంథకర్త్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

వసుమతి సాంఘిక, సాంసారికానర్థములను వివరించు చక్కని సాంఘికనవల. ఆంధ్రయువతుల క్షమాసంపత్తిని పత్యనురాగమును వెల్లడించుటలో దీనికి తుల్యమగు నవల యాంధ్రభాషయందు లేదు. విద్యాధికులచే ప్రశంసింపబడి, టెక్స్టుబుక్కు కమిటీవారిచే నప్రూవుడు చేయబడి, యున్నత పాఠశాలలలో పఠనీయగ్రంథముగా నిర్ణయింపబడుచున్నది. పాషాణ హృదయులను సైతము కరగించు వసుమతి కష్టగాథ నాంధ్ర స్త్రీ పురుషులెల్లరు తప్పక చదివి సానుభూతిని జూపువారుగాక, డిమ్మీసైజు 169 పుటలు వెల రు. 1—0—0.

విలాసము, మేనేజరు, సరస్వతీప్రెస్, గుంటూరు.